# వినోదాలు - విషాదాలు

సి. శేషగిరిరావు

1957

★ నవోదయసమితి, హైద్రాబాదు ★

ప్రథమ ముద్రణం.
1000 ప్రతులు.





# నవోదయ సమితి

## తృతీయ కుసుమము



రుద్రమాంబ ప్రింటింగ్ ప్రెస్,
ఇస్లామియాబజారు, హై. (ద)

50 నయాపైసలు

# మనవి.



మిత్రులమంతా కలసి ఒక సమితి స్థాపించి తెలుగు తల్లి సేవ చేయబూని, ప్రముఖ కవులు అయిన శ్రీ వి. ఎన్. శాస్త్రిగారి "నీరాజనం" తొలికుసుమంగా ప్రకటించి యున్నాము.

కథానికలు వ్రాయుటంలో సిద్ధహస్తులైన శ్రీ సి. శేషగిరి రావుగారు తమ కథానికల సంపుటి "వినోదాలు-విషాదాల"ను పాఠకలోకానికి అందించుట కంగీకరించి నందుకు కృతజ్ఞతలు. నేటి కాలమాన పరిస్థితుల కనుకూలముగా నూతన పోకడలు తన కవితారూపమున పొడచూపించిన ఈ యువక రచయిత తన రచనా పటిమతో తెలుగు భాషా శోభ దశదిశల వెదజల్లు వలయునని యాశించు చున్నాము.

కథాంతమువరకు (Suspense) సస్పెన్సు నుంచుంచి, రక్తి, నీతియుతమైన ఈగ్రంథము పాఠకలోకాని కానందము కలిగించుననే యాశతో ఈ రెండవ ప్రచురణ ప్రచురించు చున్నాము.

ఇట్లు

నవోదయ సమితి, ఎమ్. శ్రీనివాసరావు బి. ఏ.

హైద్రాబాద్. కార్యదర్శి,

# నామాట —

అనుభవం లేకపోయినా కలంపట్టటానికి సాహసించాను. ఆ సాహసానికి రూపంయిచ్చాను. అనుకోకుండానే ప్రోత్సాహం, ఆదరణ, ఆశీర్వచనాలు లభించినవి. వాటి ఫలితమే యిప్పుడు ఈ పుస్తకరూపంగా మీచేతుల్లోవుంది. నేను నా కథల్లో ఎవ్వరికీ ఎటువంటి నీతిని యివ్వదలుచుకోలేదు. ప్రజలకు నీతి బోధించేశక్తి నాలో లేదు. కేవలం నిత్యజీవిత సంఘర్షణలను మూరురూపంగా ప్రతిబింబింప జేయడమే నాముఖ్యోద్దేశం. ఇక నేనా లక్ష్యసిద్ధిలో ఎంతవరకు కృతకృత్యుడ నయ్యానో సోదర పాఠక వర్గమే నిర్ణయించ గలదు. వీటిని చదివి నిక్కచ్చిగా నిర్మోహమాటంగా, నిస్సందేహంగా విమర్శించి తగిన సలహాల నివ్వగల హక్కు మీకువుంది. అట్టి సలహాలకు నేను హృదయపూర్వకమైన స్వాగత మిస్తాను. కాన సహృదయులైన పాఠకులు తమ అమూల్యాభిప్రాయాల్ని పంపి, నన్ను ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాను.

నా అక్షరాలన్నీ అచ్చురూపంలో రావటానికి తన సర్వశక్తులా సహాయపడిన పూజ్యులు, కవులు బి. యస్. శాస్త్రి గారికి, ఆ అచ్చును పుస్తక రూపంలో ప్రచురించటానికి సాహసించిన "నవోదయ సమితి" వారికి నా హృదయ పూర్వక వందనాలు. పుస్తక ప్రచురణలో అనేక విధాలతోడ్పడిన మిత్రబృందానికి నా అభివందనలు.

రచయిత

జీవిత పథంలో దారీ తెన్నూ తెలియక కొట్టుకుంటున్న నాకు ఒకమార్గం చూపించి నా భావిజీవితానికి బునాదివేసి, నాహృదయ వీణా తంత్రులలో నవరాగాన్ని పలకరింప జేసి, జీవితాంధకార బాటకు వెలుగు చూపి నన్నాదరించిన పూజ్యులు "శ్రీ వి. కేసరి హనుమాన్" వుపకారం జీవితంలో మరువు రానిది. వారి ప్రేమకు, ఆదరణకు, వాత్స ల్యానికి హృదయపూర్వకమైన

"కృతజ్ఞతాంజలి"

చూపుల్లో నిష్కళంకాన్ని వెదజల్లి

చేతల్లో నిస్వార్థాన్ని ఒలికించి

మాటల్లో నిష్కపటాన్ని పలికించే

మాతృదేవత - కు

# పోయిన గడియారం

నాకు బాగా జ్ఞాపకం. రాత్రి, పడుకునేటప్పుడు చేతికి వాచ్ వుంచుకునే పడుకున్నాను. కానీ పొద్దున్నే లేచి చూస్తే లేదు. పక్కమీదనుంచి ఒక గంతు వేసి, దుప్పటిపరుపులన్నీ దులిపాను. మంచం క్రిందా, మీదా అంతా కలియ వెదికాను. గది నాల్గు మూలలా నాల్గు కళ్ళతో గాలించాను. కనపడలేదు. మరి యింతకీ ఏమయింది?

నేను పోయిన రెండు సంవత్సరాలనుంచి, ప్రెస్సు మీదిభాగం రూంలో యే భయం లేకుండా వుంటున్నాను. నాకు తెలిసినంతవరకు ముందెప్పుడు ప్రెస్సులోగానీ, నా రూంలోగానీ యిటువంటిదేమీ జరగలేదు. నా రూం పక్కనే నలుగురు కాలేజి స్టూడెంట్సు వుండేవాళ్ళు. వాళ్ళ కొరకు వాళ్ళ 'ఫ్రెండ్సు' వస్తూపోతూ వుండేవాళ్ళు. అయినప్పటికీ ఎప్పుడు నా రూం తెరచే వుంచేవాణ్ణి. కాని యింత వరకు నా గదిలో చీపురుపుల్లకూడా పోలేదంటే నమ్మండి!

అసలు ఆ వాచీ మనదికూడా కాదు, 'పోతే పోయిందిగదా' అని విచారించి వూరుకోటానికి. పాత స్నేహితుడు గోపాలం కొత్తగా కొని చేతికి పెట్టుకొని తిరుగుతూవుంటే, నాకుకూడా రెండు రోజులు అట్లా పెట్టుకుని తిరగాలని బుద్ధి పుట్టింది. అడుగగానే లేదనకుండా పాపం! [illegible] (పేనుచేతనే అనుకోండి, పాతదన్న కారణంచేత [illegible] [illegible] తీసి [illegible] వెడతాను [illegible]

దింయ్యా

వెంటనే బనియను మీద గోపాలం వుంటున్న రూంకి పరుగెత్తాను. "ఒరేయ్, నీ వాచీ ఎవడో కొట్టేశాడురా!" "అరే! ఎట్లా!!" ఆశ్చర్యంతో అడిగాడు. జరిగినదంతా చెప్పాను.

గోపాలం కొంచెం ఆలోచించి "రాత్రి నువ్వు పడుకునేటప్పుడు చేతికి గడియారం అసలు వుందా?" అని క్రాస్ చేయటం మొదలెట్టాడు. "పడుకునేటప్పుడు వుంది" అని జవాబిచ్చాను. "ఒకవేళ మర్చిపోయావేమో! బాగా జ్ఞాపకం తెచ్చుకో". "నాకు బాగా జ్ఞాపకం, రాత్రి పడుకునేటప్పుడు చేతికి గడియారం వుంది" అన్నా. గోపాలం కొంచెంసేపు తీవ్రంగా ఆలోచించి, దగ్గరగా కుర్చీ జరుపుకొని—

"నిజం చెప్పరా! నాకు అన్నీ తెలుసు. నీకన్నా ఎక్కువ అనుభవం కలవాడినే! ఇంతకీ దాన్ని నీ—ప్రియురాలికి 'దానం' చేశావా?"

నాకు ఈ మాటలు వినగానే ఒళ్ళు మండిపోయింది. కోపంతో "ప్రియురాళ్ళు ఎవర్రా? పిండాకూడు వాళ్ళు. అసలు అది.........". నా మాట పూర్తి కాకముందే, భుజంమీద తట్టుతూ "నా దగ్గర దాయకు. 'మనిషి' అన్న తరువాత తప్పులు చేస్తూనే వుంటాడు. కొందరు పెద్ద తప్పులు చేస్తారు. మరికొందరు చిన్నవి. అంతే!" అని గోపాలం అంటున్న వేదాంతం వినేసరికి నా బుర్ర వేడెక్కిపోయింది.

గడియారం పోయిందన్న సంగతి క్రింద ప్రెస్సులో పని చేస్తున్న నా స్నేహితులందరికీ తెలిసిపోయింది. "ఎట్లా పోయింది ? ఎలా పోయిందీ ?" అని అడిగేవాళ్ళకు సమాధానం చెప్పలేక నేను నా రూంకు వెళ్ళి 'ఏమిచేయుటము?' అని ఆలోచిస్తూ కూర్చున్నాను. ఇంతలో క్రింది ప్రెస్సులోని సంపాదకులు గారు నా రూంకు వచ్చి ముందుగా గడియారం పోయినందుకు విచారం చూపి ఎలా పోయిందని' అడిగారు. నేను జరిగినదంతా 'తు:చ ' తప్పకుండా వారికి చెప్పాను. రామాయణం విన్న తరువాత 'రాముడికి సీత యేమవుతుందని ఎవరో మహానుభావు డడిగినట్లు, మా సంపాదకులు గారు "గడియారం ఎక్కడ పెట్టి పండుకున్నావు ?" అని మళ్ళీ అడిగారు. "చేతికి !"

నా ఈ మాట విన్నతరువాత వారు లేచి గదిలో అటూ, ఇటూ తిరుగుతూ. ఏదో ఆలోచించి గదిలోని వస్తువులన్నీ కిందా, మీదా చేసి చూశారు. ఆఖరికి పక్కకూడా దులిపారు. ( పాపం ! ) ఈ తతంగమంతా అయినతరువాత, నా మీదవున్న చనువుకొద్దీ 'నీవంటి ప్రపంచజ్ఞానం వున్నవాళ్ళు అలా నిర్లక్ష్యంగా, చేతికి గడియారం పెట్టుకొని బయట పండుకోవటం యేమీ బాగాలేదు." అన్నారు. "అవునండీ ! చేతికి గడియారం పెట్టుకొని బయట పండుకోవటం నిజంగా తప్పే !" అన్నాను. "తప్పని చిన్నగా అంటావేమి ? చాలా పెద్ద తప్పు !. ఎటు లేదన్నా దాని 60, 70 రూపాయలకేం తక్కువుండదు. అనవ

రోజులు ముందులాగా లేవు ప్రతివానికీ స్వార్థం ఎక్కువయి పోయింది. ఇదంతా తెలిసికూడాను........" అని ఆపేశారు. అవునండీ! తెలిసికూడా గోతులో పడ్డాను." నీళ్ళు నములుతూ నేను అనగానే, వారు వెంటనే మొదలు పెట్టారు.

" నన్ను చూడండి. దగ్గరదగ్గర నలభై యేండ్లు వచ్చినయి ఇంతవరకు ఒక చిన్న గుండుసూదినికూడ పోగొట్టుకోలేదు. నావస్తువులన్నీ జాగ్రత్తగా వుంచుకోవడం నాకు బాగా తెలుసు. అట్లా జాగ్రత్తగా వుంచుకోవడం తెలియక పోతే, యింత పెద్ద చదువు చదివి ఏంలాభం?- నేను రోజూ యింటికి వెళ్ళగానే, మా శ్రీమతిగారికి ఖరీదైన వస్తువులన్నీ భోషాణంలాగ వున్న ట్రంకులో పెట్టి తాళం వెయ్యమని ఆర్డరిస్తాను. అలా ట్రంకులో పెట్టి తాళం వెయ్యడంవల్లనే యింతవరకూ యేచిన్నవస్తువు పోలేదు. మీరుకూడా వాచ్ ట్రంకులో పెట్టి పండుకున్నట్లయితే, అది ఇవాళకూడా దగ్గరే వుండేది" అని చిన్న లెక్చర్ యిచ్చి " నరేనోయ్, టైం అయింది. వెళ్ళొస్తాను" అంటూ వెళ్ళిపోయారు.

నిజంగా సంపాదకులుగారు అన్నట్లు ట్రంకులో పెట్టినట్లయితే వాచ్ వుండేదేమో! ఇంతచిన్న విషయంకూడా నా బుర్రకు తట్టలేదు. నిజంగా అప్పుడు నామీద నాకే కోపం వచ్చింది.

ఇదేవిషయం ఆలోచిస్తూవుండగా టైపిస్టు సోమశేఖర్ వూడిపడ్డాడు. రాగానే వాచి పోయినందుకు "పాపం!" అని సానుభూతి ప్రకటించాడు. "ఈ వెధవకబురు వినగానే నాకు చాలా విచారం కలిగింది బ్రదర్" అన్నాడు. నేను విషయం మరిపిద్దామని "సరేకానీ, ఎక్కడనుంచి రావటం?" అన్నా. "ఇంటినుంచే వస్తున్నా. ఇక్కడ యిటువంటి వెధవకబురు వింటానని నాకేం తెలుసు. సరే, వాచి ఎక్కడపెట్టి పందుకున్నావు?" అని ప్రశ్నించాడు. అసలు ఈప్రశ్నకు యేం సమాధానం చెప్పాలో తోచక తికమక పడ్డాను. చేతికి పెట్టుకోని, బయట పందుకున్నానంటే మా సంపాదకుడుగారు అన్నట్లు, వీడుకూడా 'తెలివితక్కువ దద్దమ్మ' అంటాడేమోనని "పెట్టిలో పెట్టి తాళంవేసి బయట పందుకున్నాను" అన్నాను. నా ఈ జబాబు వినగానే సోమశేఖర్ నవ్వుతూ "అట్లా చెప్పు! నిజంగా నీది వొట్టి మట్టిబుర్ర అంటేనమ్ము! వాచ్‌ని ఎవరయినా పెట్టెలో పెట్టి తాళంవేసి పందుకుంటారా? తెలివితక్కువ దద్దమ్మ; ఖరీదుగల వస్తువులన్నీ ఎప్పుడూ ఎవ్వరి వూహకు అందని స్థలంలో పెట్టాలి. నీ వాచ్‌ని యే పుస్తకాల బీరువాలోనో, యే పుస్తకం మధ్యనో పెట్టినా బాగుండేది. దొంగకు అసలు పుస్తకాల బీరువాలో కానీ, పుస్తకాలలో కానీ, యేదైన ఖరీదుగల వస్తువు భద్రపరిచి వుంటుందనే అనుమానం తట్టదు."

సోమశేఖర్ చెప్పిందికూడా బాగానే అనిపించింది. ఉద్యోగానికి టైం అవటంవల్ల శేఖర్ వెళ్ళిపోయాడు.

'పది అవుతుంది. మొఖం అన్నా కడుక్కొని బయటికి పోదామని' లేస్తుండగా, ప్రక్క గదిలో వుంటున్న స్టూడెంట్ ప్రసాద్ రానేవచ్చాడు "ఏమండీ! వాచ్ ఎలాపోయింది? ఎక్కడపెట్టి పండుకున్నారు??".

అందరూ అడిగినట్లు అతనూ అడిగాడు. నేను వెంటనే తడుముకోకుండా "పుస్తకాల బీరువాలో, పుస్తకాలసందుల్లో పెట్టాను." ఈ మాటలు వినగానే ప్రసాద్ నవ్వటం మొదలెట్టాడు. "అది పుస్తకాల బీరువాలో పెట్టే వస్తువా?— బహుశః మీరు చాలా నవలల్లో చదివివుంటారు; దొంగలు ముఖ్యంగా బీరువాలన్నీ గాలించి వూడ్చిపెడతారు. తెలిసి కూడా పప్పులో కాలువేశారు. వాచ్‌ని ఎలా భద్రంగా దాచిపెట్టాలంటే, మనం పండుకునేటప్పుడు, దిండుక్రింద పెట్టుకొని పండుకోవాలి. దొంగ యేమిటి, దొంగ అబ్బకూడా వాచ్ ఎక్కడున్నదీ తెలిసేదికాదు." అని ఆ స్టూడెంట్ కూడా నా తెలివికి నవ్వటం మొదలుపెట్టాడు. కాలేజీకి టైం అవటం వల్ల అతనూ వెళ్ళిపోయాడు.

లేచి మొఖం కడుక్కొని 'కాఫీ' త్రాగుదామని బజారుకు బయలుదేరాను. దారిలో స్నేహితుడు సబ్ ఇన్స్పెక్టర్ కేశవ్ కలసి "ఏంరా! వాచ్ పోయిందట! ఎట్లాపోయింది? అని అడిగాడు. నేను ఆశ్చర్యంతో "నీకు ఎలా తెలిసిందిరా?" అన్నా. "గోపాలం చెప్పాడులే! ఇంతకీ అది ఎక్కడపెట్టి పండుకున్నావు?" "పండుకునేటప్పుడు, తీసి దిండుక్రింద పెట్టి పండుకున్నాను"—

ఈ మాటవిని ఇతనుకూడా విరగబడి నవ్వటం మొదలుపెట్టాడు. నవ్వు ఆపుకొని "నేను దొంగతనాల్ని గురించి చాలా పుస్తకాలు చదివాను. దొంగల మనస్తత్వం నాకు బాగా తెలుసు. నీవు వాచ్‌ని దిండుక్రింద పెట్టి పడుకున్నావు. సగం తెలివైనపనే చేశావు — పూర్తిగా కాదు. ఒకవేళ నిద్రలో తల దిండుమీదినుంచి జరిగిపోయిందనుకో. దొంగ చూస్తే వదిలిపెడ్తాడా; వదిలిపెట్టడు. అందుకని నేను చెప్పేది యేమిటంటే, వాచ్‌ని చేతికి పెట్టుకొని నిశ్చింతగా నిద్రపో. దొంగవెధవలకి మనచేతిగడియారం తీయటానికి గుండె లెక్కడివి? ఇకముందు ఇలువంటి తెలివితక్కువ పనులు చెయ్యకు. వెళ్ళొస్తా" అంటూ వెళ్ళిపోయాడు.

ఆఖరికి "వుయ్యాల వూగివూగి ఒకేచోటికి చేరుతుందన్నట్లు" నా కథకూడా మళ్ళీ మొదటికే చేరుకుంది. కేశవ్ సలహా వినగానే, వుదయంనుంచి వాచ్ పోయిందని విచారంతో వుంటున్న నాకు ఒక్కసారి ఎక్కడలేని నవ్వు వచ్చిందంటే నమ్మండి!

కాఫీహోటల్లో దూరి, యిదేవిషయం ఆలోచిస్తూ వేడివేడి కాఫీ తాగ్గానే నాలుక చురుక్కుమంది.

# తృష్ణ

వివాహం జరిగి మూడుసంవత్సరాలయినా అతని జీవితంలో యింకా యేదో తృష్ణ కలవరిస్తూనేవుంది. వివాహం ముందుకూడా అతను యిటువంటి "తృష్ణ" నే 'ఫీ' లయ్యాడు.

తనముందు కట్టలరూపంలో గుట్టలుగా పడివున్న ఫైళ్ళవైపు దృష్టి ప్రసారించాడు మాధవరావు. రాస్తూవున్న కలాన్ని ఆపి, క్రిందపెట్టి "అబ్బ" దీర్ఘ నిశ్వాసతో మొఖం మీది చెమటను రుమాలుతో తుడుచుకున్నాడు. ఇంతలో ప్యూన్ వచ్చి యింకా కొన్ని ఫైళ్ళు......

'నా ఆశయాలన్నీ యీ ఫైళ్ళమధ్య నలిగి కృశించి పోతూవున్నాయి. ఆఖరికి నా జీవితంకూడా యీ ఫైళ్ళ బరువు మోయలేక గిలగిలా తన్నుకొని ప్రాణం విడుస్తుం దేమో! ఇలా 'రసం' అంటూ లేని తన శుష్కజీవితాన్ని గురించి ఆలోచిస్తూ, మధ్య మధ్య వులిక్కిపడి పనిచేస్తూ, ఎలాగో నాలుగయేదాక గడిపేవాడు.

గడియారం యే చింతా లేకుండా తనపనిని నిర్విఘ్నముగా సాగిస్తూ నాలుగు కొట్టింది. గడియారం నాలుగు కొట్టటంతో అతని జీవితంలోకూడా ఒకరోజు తగ్గింది. గడియారం ముల్లులు ముందుకు సాగుతూ సమయాన్ని పూర్తి చేస్తాయి. అలానే సమయం తన గమనంలో మానవ జీవితాన్ని!—

ఆఫీసునుంచి యింటిదారి పట్టగానే అతని ఆలోచనలు, సుడిగాలిలోని ఎండిన ఆకుమాదిరి ఎక్కడెక్కడికో పరిగెత్తేవి.

'లక్ష్మి నాకోరకు ఎదురుచూస్తూవుండవచ్చు! ఇంట్లో ఒక్కతే గదా! పాపం! రాజుతో ఆడుకుంటుందేమో!!'

ప్రతిరోజూ యిలా మధురమైన ఆలోచనలు చెలరేగి, పనిలో పొరపాట్లు చేయడంవల్ల ఆఫీసరుతో పడ్డ తిట్లను, శ్రమనంతో క్షణమాత్రం మరిపించేవి.

కానీ——వివాహం జరిగిన మూడు సంవత్సరాల దీర్ఘకాలంలో, 'లక్ష్మి' ఒక్కసారికూడా తనరాక కోసం నిరీక్షిస్తున్నట్లు మాధవరావుకు గోచరించలేదు. అతని నిరాశ హృదయంలోని ఈ కోర్కె 'క్షయరోగి' మాదిరి తపించి, కృశించి, నశించటానికి తయారయింది.

ఇంటి నాలుగు గోడలమధ్య అడుగుపెట్టగానే యేదో తెలియనిబాధ, అసంతృప్తి అతన్ని వూపిరాడనీయకుండా కలవర పరిచేవి. అదే తలుపు, అవేగోడలు! అంతా అదే వాతావరణం. ఈ నాలుగు గోడలమధ్య, యీ వాతావరణం మధ్య 'లక్ష్మి' కిలకిలలు వినాలనుకునేవాడు. తనరాకకోసం ఆమె తపించిపోతున్నట్లుగా చూడాలనుకునేవాడు. కానీ——'లక్ష్మి' మంచిగా తలదువ్వుకొని, శుభ్రంగా తయారయి, ఆఖరికి చిరునవ్వుతోకూడా అతన్ని ఆహ్వానించిన పాపాన పోలేదు.

లక్ష్మియొక్క యీ ఉదాసీనత్వమే అతని ప్రతి శరీరాణువును కాల్చివేసేది. గడపలో అడుగు పెట్టగానే అతని వుత్సాహాన్ని ఎవరో తిరస్కారంచేసి, గొంతు పిసికి, ఉత్తర క్రియలకు తయారుచేస్తున్నట్లు తలిచేవాడు.

వివాహం ముందు ఎన్ని మధురభావాలు స్త్రీ విషయములో హృదయ ఫలకంమీద మొలకలెత్తారో, సంవత్సరాలు గడిచినా యింకా ఆ మొలకలు మొలకలమాదిరిగా వుండి గిడసబారిపోయాడు. స్త్రీ ఔన్నత్యాన్ని గురించి అతనిలో నిర్మాణం సాగించిన కొన్ని ఉదాత్తమైన, ఉన్నతమైన ఆలోచనలు యింతవరకూ నిర్మాణంలోనేవుండి ఆఖరికి నిర్యాణానికీ దారి తీసినయి.

'లక్ష్మి' వంటింటి పిల్లిగా తయారవటం అతనికి సుతరామూ యిష్టంలేదు. మాతృత్వ బాధ్యతలతోపాటు, ఒక అర్ధాంగి విధుల్నికూడా ఆమెలో చూడాలనుకునేవాడు. ఆమె అలంకరణ సంఘములో ఉచ్ఛస్థాయిని సంపాదించడానికి గాకుండా, లోకానికి, చూపించడానికి కాకుండా తనకోసం కూడా కోరేవాడు. తన మానసిక వేదనా నివృత్తికోసం ఆమెలో పరివర్తనం కల్గించడానికి ఎన్నో తిప్పలు పట్టాడు. వుపవాసాలు చేశాడు. అలిగాడు. యింకా......అయినా 'లక్ష్మి'లో అతనికి ఒక స్త్రీత్వమే ప్రతిబింబించింది. అతనికి కావలసింది భార్య అనురాగంకానీ, స్త్రీత్వంకాదు!

అందుకనే మూడుసంవత్సరాలపాటు పూర్తి జీవితానందాన్ని గ్రహించిన వ్యక్తిగా, ఒక బిడ్డ తండ్రిగా తయారయినా, యేదో ముగ్ధపు ఆవేదన, యింకా యేదో 'తృష్ణ' అతని జీవితంతో పెనుగులాడుతూనే వున్నయి. వివాహం ముందుకూడా అతను యిటువంటి తృష్ణనే ఫీలయ్యాడు.

★

ఇవ్వాళ అతని ఎదలోని 'తృష్ణ' వెల్లుబికి తిరుగు బాటుకు సిద్ధపడింది—మాధవరావు ఆలోచిస్తూ, నడుస్తూ నడుస్తూ త్రుళ్ళిపడ్డాడు. ఆగాడు. అతనిమనసు ఏదో నికృష్ట కార్యానికి ప్రోత్సహించసాగింది. అలానే హృదయభారంతో ఇల్లు చేరుకున్నాడు.

"లక్ష్మి" తలుపు తట్టుతూ పిల్చాడు.

"ఆఁ! వస్తున్నా!" 'లక్ష్మి' వచ్చి తలుపు తెరిచింది. మాధవరావు కొద్ది క్షణాలవరకు గడపదగ్గరనే నిలబడి పోయాడు. తలుపు తెరిచి ఒక్క క్షణంకూడా నిలబడకుండా మెరపు మెరసిన గతిగా లోపలికి వెళ్ళి, తన పనిలో నిమగ్న మయిన 'లక్ష్మి' వైపు నిరాశతో చూచాడు—కానీ ఆశ్చ ర్యంతో కాదు !!

'లక్ష్మి' యొక్క ఈ ప్రవర్తన ఈనాడు అతని నర నరాన్ని మండించింది. ఎండమావుల్లో దివ్యోదకపు కొసేరు లను ఆశించి నిరాశ చెందినట్లుగా అతను నిరుత్సాహపడ్డాడు. అలానే తల వంచుకొని లోపలికి జేరాడు.

"రాజు యేడీ?" యేంమాట్లాడాలో తోచక తన వుద్రేకాన్ని దిగమింగుతూ అడిగాడు. "పండుకున్నాడు" మాధవరావు వైపు చూడకుండానే తనపని చేసుకుంటూ అన్నది 'లక్ష్మి'.

అతను అలానే కొద్దిసేపటివరకు లక్ష్మివైపు రెప్ప వాల్చకుండా చూచి తన గదిలోకి వెళ్ళిపోయాడు. భుజం మీది తువ్వాలు విసిరి మంచంమీద పారవేశాడు. గదిలో

వేలుగాలిన పిల్లిలాగ అటూయిటూ తిరుగుతూ, సిగరెట్ పీలుస్తూ పచార్లు చేస్తూ సాగాడు. నిస్పృహ సంవేదనలన్నీ వాకటగా సమ్మెకట్టి అతని హృదయాన్ని కాల్చ సాగినయి.

గాలికోసం కిటికీ తెరిచి బయటికి దృష్టి ప్రసారించాడు. సూర్యుడు పశ్చిమ దిక్కున జీర్ణమైన విషాద రేఖలతో కృంగుతున్నాడు, 'లక్ష్మి' అలానే తన పనిలో మునిగివుంది.

"లక్ష్మి !"

"ఆఁ! వస్తున్నా" అదే పూతపదంద్వారా జవాబు.

"యేమిటి?"

"కూర్చో" మాధవరావు అంతా మరిచి చిరునవ్వుతో ఆమెవైపు చూచాడు.

"ఏమిటో చెప్పండి తొందరగా! అవతల పాలు పొంగి పోతాయి."

మాదవరావు హృదయం చివుక్కుమంది. ఈమాటలు మండుతున్న అతని ఆనందోద్రేకంమీద నీళ్ళలాగ పని చేసినయి.

"ఏమిటో చెప్పండి?" 'లక్ష్మి' అలానే నిలబడింది.

"యేమీలేదు. పాలుపొంగిపోతాయేమో! ముందు చూడు"

'లక్ష్మి' వెళ్ళిపోయింది. 'లక్ష్మి' దృష్టిలో ఆపాలకున్నంత నా హృదయావేదనకు లేదుకదా! ఎప్పటికీ పాలు

పొంగిపోతాయి, పిల్లవాడు యేడుస్తున్నాడు, కూర మాడిపో తుందన్న ధ్యాసేకానీ, పొంగిపోతున్న నా వుదేకంమీద, ఏడుస్తున్న నా హృదయంమీద, మాడిపోతున్న నా ఆశయాల మీద ఆమెకు కొంచెంకూడా ధ్యాసంలేదు.'' అని కుమిలాడు మాధవరావు.

శిథిల స్మృతులు అతని నిరుత్సాహాన్ని సమతలం నుంచి, అగాధానికి త్రోసిపారేసినయి. ఆనందంలేని ఈ నికృష్ట జీవిత నివృత్తి అతనిమనసు పరిపరివిధాల పరువులెత్తసాగింది.

ఏదో ఆలోచన తళుక్కున స్ఫురించగానే, 'లక్ష్మి'కి చెప్పకుండా తువ్వాలు భుజంమీద వేసుకొని బజారువెంట పడ్డాడు. నడుస్తూ నడుస్తూ ఒకసారి నిలబడ్డాడు.

తిమిర దేవత అప్పుడే లోకాన్ని తన కౌగిలిలోకి తీసుకుంది. గట్టిగా ఒక్కసారి తలను విదిలించాడు. అతని మనస్సు ఆ చీకటిలో యేదో యింతకుముందెరుగని ఒకదారి కోసం వెతుకసాగింది. అతని 'తృష్ణ', ఆనందంలేని బడలిక హద్దులుదాటి, ఏదో అమరికకోసం, పొందుకోసం తల్లడిల్లింది. ఆఖరికి చీకటిగావున్న ఒక సందులోకి చేరి అతనికాళ్ళు అప్ర యత్నంగా ఆగిపోయినయి. ఆ చిక్కనిచీకటిలో, అమావాస్య నాడు చుక్కలు మెరిసినట్లుగా, అక్కడక్కడ గుడ్డిగా దీపాలు కనపడసాగినయి. గజ్జెలచప్పుడు, వాయిద్యాల శ్రుతి పేయుసం గీతం, మనసును ఉత్తేజపరిచే కంఠాల మధురరావం అతని చెవులకు మందంగా వినపడసాగింది,

మాధవరావు నాలుగువైపులా ప్రసన్నవదనంతో వీక్షించాడు. 'తృష్ణ' స్థానంలోనే 'తృప్తి' అతని ముఖంలో అకస్మాత్తుగా ప్రస్ఫుటితమైంది. జేబును ఒకసారి తడిమి చూచుకొని, ఆ చీకటిలో తడుముకుంటూ ముందుకు సాగించాడు.

# తనదాకా వస్తే

నా శ్రీమతిగారు ఆదర్శ మహిళా సంఘానికి కార్యదర్శి. ఉన్నత సంస్కారభావాలుగల నారీమణి. తన మిడిల్‌స్కూల్ చదువునంతా రాత్రింబగళ్ళు ఖర్చుచేసి 'సంఘం' వున్నతికొరకు వ్యాప్తికొరకు పాటుపడుతూవుంది. నా 'భార్య 'అని పొగడ కూడదనుకోండి ! అయినా పొగడకుండా వుండలేను. ఆమె ఈ ప్రయత్నం ప్రశంశార్హనీయమే కాకుండా, తోటి స్త్రీ రత్నాలకు ఆదర్శనీయం కూడాను! నేనుకూడ స్త్రీస్వాతంత్ర్య ప్రియుల జాబితాలో చేరి, సంఘ శ్రేయస్సుకొరకు పాటు పడే వాడిని కాబట్టి, ఆమె ఈ ప్రయత్నానికి ఏ అభ్యంతరం తెలుపలేదు; ఆటంకపరచనూలేదు. ఈ కారణంగా తన 'సంఘ' కార్యాలన్నీ నిర్విఘ్నంగా సాగించేందుకు ప్రయత్నిస్తూ వుండే సందర్భంలో, ఒకొకసారి నాకు 'బ్రాహ్మణ భోజనహోటల్' దారి వెతుక్కోవలసివచ్చేది. ఆ హోటల్లోని వుప్పులేని నీళ్ళచారు మెతుకులు నోట్లో పెట్టుకోగానే, కడుపులో అణగి వున్నకోపం ఆగలేక నోటివరకు వచ్చేది. వేంటనే నాలోని 'సంఘసంస్కర్త' ఆకోపానికి అక్కడ బ్రేక్ వేసేవాడు.

రాత్రి పది అయింది, మర్నాడు ఆఫీసులో ఇన్స్పెక్షన్ వుండటంవల్ల, ఆఫీసు ఫైల్సు కొన్ని యింట్లోనే సరిచేస్తూ కూర్చున్నా మా నారీమణిగారు తిన్నకంచాలుకూడ కడగ కుండా ఎలకలవంతుకువిడిచి, చిన్న టేబిల్ ల్యాంపు వెలుతు రులో, ఏదోరాస్తూకూర్చున్నారు. కొద్దిగారాయటం, మళ్ళీ కొట్టివేయటం ! ఆలోచనగా సిగరెట్ వెలిగిస్తు అలాచక్కాడ

గానే, ఇంతవరకు కొద్దోగొప్పో రాసినకాగితాన్ని చిత్తగం వలో పడవెయ్యటానికి తయారుచేస్తూవుంది. మళ్ళీకొత్తకాగితంమీద రాయటం మొదలు, వెంటనే కొట్టివేయటం ఆమె ఈధోరణిచూస్తే "రెండువాక్యాలురాసి, మూడువాక్యాలు కొట్టివేస్తుందేమొ !" అన్నమాదిరిగావుంది. అయినా మన కెందుకని నా ఆఫీసుపనిలో నిమగ్నమయ్యాను.

గోడగడియారం పదకొండుకొట్టటం, నాకుఆవులింతలు రావటం ఒకేసారిజరిగింది. తలెత్తిచూశాను. మా దేవిగారు ఇంకా రాస్తూవున్నారు. కలంచకచకా నడుస్తువుండటం వల్ల కొట్టివేతలు తక్కువైనట్లు తోచింది. ఫైలున్ని మూసి, పడుకుందామనే వుద్దేశ్యంతో లేచాను. ఇంతలో నాఎదుట ఆదర్శ మహిళాసంఘకార్యదర్శిగారు ప్రత్యక్షం "అప్పుడే పడుకుంటున్నారా ?" అని ప్రశ్న. "దేవిగారి ఆజ్ఞఅయితేసరి లేకపోతే కూర్చుంటా !" అని మాజవాబు. "చాల్లేండి ! మీరు మీవేళాకోలాలును ! ఇంతకీ నావుపన్యాసం సరిచేసిపెడతారా లేదా?" మొఖంమీద చెమటను తుడుచుకుంటూ అడిగింది. పాపం ! అప్పటి ఆమెస్థితి చూస్తే నాకేకాదు, ఎవ్వరికైనా జాలికల్గుతుంది. నెత్తిమీది ముంగుర్లు మొఖంమీది బొట్టును చెమట లాక్కుపోతూవుంది.

ఇంతవరకు రాసింది 'వుపన్యాసం' అని వినగానే 'ఎల్లుండి వాళ్ళ సంఘవార్షికోత్సవం' అన్నసంగతి గుర్తు కొచ్చింది. "ఎల్లుండేనా మీ వార్షికోత్సవం" ప్రశ్నించాను. అవునన్నట్లు తలవూపింది. "అయితే ఉప్పులేని నీళ్ళచారు

మెతుకులు తినాల్సినగతి పట్టిందన్నమాట." నవ్వుతూ నే ననగానే "తప్పు, తప్పు! 'గతి' ఏమిటి. అదృష్టం!!" నా నవ్వులో తన చిరునవ్వు కల్పింది. ఇంతలో వంటింట్లో ఏదో ఇత్తడిగిన్నె ప్రాణం భూమిమీదికి ఆకర్షింపబడి, చిన్నబాంబు పడ్డంత శబ్దం అయింది. "అబ్బబ్బ! ఈ ఎలుకల్తో పడలేకుండా వున్నా. వుండండి యిప్పుడే వస్తా" నంటు వంటింటి దారి పట్టింది.

ప్రతిసారి కరెక్టుచేయటానికిచూస్తే, ఆమె అన్ని వుప న్యాసాలకన్న, ఈ వుపన్యాసం కొంచెం కొత్తపోకడపోయింది. శ్రమపడి ఎక్కువ గొప్ప తప్పులు లేకుండా బాగానేరాసింది.

నిద్ర ముంచుకొస్తు వుండటంవల్ల, పక్కమీద నడుం వాల్చాను. ఇంతలో మా శ్రీమతిగారు "అప్పుడే నిద్రపోతా రేమండి! కొంచెం నా వుపన్యసించే ధోరణికూడా సరి చెయ్యండి" అంటూ నాజబాబుకు నిరీక్షించకుండానే, కొంగు నడుంచుట్టూచుట్టి, వుపన్యాస కాగితాన్ని చేతిలో పట్టింది. అప్పుడు ఆమె నిలబడ్డ 'పోజు' చూస్తే "ఆమె ఝాన్సీలక్ష్మీ బాయి. కాగితం చేతిలోని కరవాలం" అన్నట్లు కనపడింది. నేను కూజాలో చల్లనినీళ్ళు యిన్ని మొఖానకొట్టి, నిద్రదేవ తకు కొంచెం ఆగమని వార్నింగ్ యిచ్చి, ఆమె వుపన్యాసానికి శ్రోతగా తయారయ్యాను.

"పూజ్య అధ్యక్షుణీ! తోటి భావిభారత నారీ మణు లారా! నేడు మీరందరూ యింతగొప్పసంఖ్యలో యిక్కడ

చేరటం, ఆనందించి గర్వించదగినవిషయం. మనసంఘం 'ప్రథమ వార్షికోత్సవ' సందర్భంలో, మీముందు "సంఘ చైతన్యానికి స్త్రీలే అవసరము" అన్నవిషయం గురించి ప్రస్తావింప బోతు న్నాను.

మనసంఘ వుద్దేశ్యాలలో 'వితంతు వివాహం' ముఖ్య మయింది. ఇంతవరకు అటువంటి వివాహం చేయించగల అవ కాశం, అదృష్టం మనసంఘానికి కలుగ లేదు. ఈ విషయంలో ముఖ్యంగా పురుషులు ముందంజ వేయాలి. అంతే కాదు! స్త్రీలు కూడా ముందుకు రావాలి. పురుషుల్లో వితంతువుల యందు ఆదరాన్ని, అభిమానాన్ని కలిగింది, ముందుకురాగల ప్రోత్సా హాన్ని కల్పించటం మనచేతుల్లోవుంది. బాల్య వివాహాలు నశించి, వితంతువివాహాలు మొదలయిననాడే 'సంఘం' బాగు పడుతుంది. సంఘం బాగుపడటంలోనే దేశ కల్యాణం, దేశ కల్యాణములోనే మనసుఖంవుంది. ఇందుకని ముందు మన పతి దేవుల్ని పురోగమించాలి. వాళ్ళలో చైతన్యం కలిగించాలి. వాళ్ళను ఇటువంటి వివాహాలకు సిద్ధపడేటట్టు చేయాలి. ఇదంత మనచేతుల్లోవుంది. దేశసౌభాగ్యలక్ష్మికి పునాదులమైన మన స్త్రీల చేతుల్లోవుంది. మనం ముందంజవేసి, ఆదర్శ నారీమణు ల్లాగ తయారయిననాడే నేడు మన తోటి సోదరీమణులను పీడిం చుకు తింటున్న 'వితంతు వివాహ' సమస్య పటాపంచ లవటా నికి అవకాశంవుంటుంది. మీరందరు యిందుకు సిద్ధపడాలి. మీ మీ భర్తల్ని, బంధువుల్ని యిందుకు సిద్ధపడేటట్లు చేయాలి. సంఘంలో నూతనశోభతో పరివర్తనం కలిగించి జీవితంలో

ఆదర్శ మహిళామణుల్లాగ తయారయి, దేశసౌభాగ్యంకోరకు పాటుపడతారని ఆశిస్తూ నా వుపన్యాసాన్ని ముగిస్తున్నాను. ''

వుపన్యాసం వినటంతో నానిద్రమబ్బు పూర్తిగా వదిలి పోయింది "ఎలావుందండీ ? '' అని అడగ్గానే, త్రుళ్ళిపడి "మార్వలెస్ ! ఎక్సలెంట్ !! బ్యూటిఫుల్ !!! ఇక నీవుపన్యాసం ముందు........'' "చాల్లేండి పొగడ్తలు చాలా శ్రమయిచ్చాను. ఒంటిగంటయింది. ఇక పడుకోండి. '' "దేవిగారి ఆజ్ఞప్రకారమే జరుగుతుంది. '' అంటూ నిద్రలోకానికి టికెట్ కొన్నాను.

సంఘవార్షికోత్సవం అనుకున్న దానికన్న ఎక్కువ జయప్రదంగా జరిగినట్లు, అందులో తనవుపన్యాసం ఎక్కువగా మెచ్చుకోబడినట్లు మా ఆవిడగారు తెలిపారు.

ఒకనాడు సాయంత్రం ఆఫీసునుండి తిరిగి వచ్చేసరికి మా ఆవిడ ఎవరో అమ్మాయితో మాట్లాడుతూవుంది. నేను తిన్నగా నా రూంలోకి వెళ్ళిపోయాను. అయిదు నిముషాల తరువాత ఆమెను వంపించి 'టీ' పట్టుకొచ్చింది.

"ఎవరా అమ్మాయి?'' వేడివేడి టీ త్రాగుతు అడిగాను. "ఒక వితంతువు'' ఈ సమాధానం వినగానే అదిరి పడ్డాను. "మరి యిక్కడి కెందుకొచ్చింది?'' ఆ అమ్మాయికి పెళ్ళి చేయవలసిన బాధ్యత మా సంఘంనెత్తిన పడింది. సంవత్సరానికి మాకే అవకాశం దొరికింది. మీ స్నేహితుల్లో ఎవరన్నా ఆ అమ్మాయికి తగిన సంస్కారవురుషుడు వున్నా

డేమో చూడండి.'' నా ప్రశ్నకు ఈ సమాధానం వినగానే ఆలోచనలో పడ్డాను. "మేము ప్రయత్నిస్తున్నాము. బయట ఎక్కువగా తిరుగుతూ వుంటారు. మీరు కొంచెం ప్రయత్నించండి.'' "ప్రయత్నించడానికే ప్రయత్నిస్తాను. కానీ వితంతువును వివాహం చేసుకోటానికి యే బ్రహ్మచారి యిష్టపడతాడా? అన్న సందేహంగా వుంది.'' అన్నానో లేదో కార్యదర్శిగారు నామీద విరుచుకుపడింది. "వితంతువుని వితంతువుని? వితంతువుమాత్రం స్త్రీ కాదా? ఇప్పుడొచ్చిన అమ్మాయిలో యేంలోపం వుందంటారుని? అందంగావుంది. గుణవంతురాలు. మిడిల్ స్కూలువరకు చదువుకుంది. యేంలోపం వుందంటారు చెప్పండి? ఇటువంటి అమ్మాయిని చేసుకున్నవాడు అదృష్టవంతు డనుకోండి ......... అంటూ చిన్న లెక్చరు యిచ్చింది. "నిజమే అన్నీ బాగానే వున్నాయి. మరి మీ సంఘసభ్యుల భర్తల్లో ఎవరికో ఒకరికి చెయ్యకూడదూ?'' అన్నా ఆగలేక "చెయ్యాటానికే చెయ్యొచ్చు. మా సభ్యులందరూ తమ భర్తల్లో ఎవరికో ఒకరికి యిచ్చి చేసి, ఆదర్శయువతుల్లాగ తయారయి సంఘచైతన్య జీవితబాటకు మైలురాళ్ళుగా నిలబడ్డానికి సిద్ధంగావున్నారు. కానీ భర్తలే ఒప్పుకోటంలేదు. నిజంగా మీ మగవాళ్ళకు ఒకొకసారి మతిపోతుందండి. లెక్కలేనన్ని అనుమానాలు పుట్టిస్తారు. ఆలోచన్లేభార్య యిష్టపడుతూవుండగా, చేసుకుంటే యేం పోతుంది. పైకి "సంఘ సంస్కరణం'' అని డాబ్బా వాయించుకుంటారు."

(శ్రీమతిగారు ఆవేశంలో ఇంకా ఏమేమో మగాళ్ళను గురించి అన్నారు. అవన్ని ఇక్కడ రాయడం బాగోదు లెండి! )

"సరేకానీ! యింతకీ నన్నేం చెయ్యమంటావు? " శాంతంతో అన్నా. " ఏమీ లేదు. శ్రమ అనుకోకుండా మీ స్నేహితుల్లో ఎవర్నయినా యిందుకు సిద్ధపడేలాగ చూడండి. పిల్ల రత్నంలావుంది " అన్నది. " అయితే నన్ను పెళ్ళిళ్ళ పేరయ్య అనమంటావు? అదికూడ పితంతు పెళ్ళిళ్ళ పేరయ్య !! " అన్నా నేను నవ్వుతూ. " అయితే తప్పేముందండి. ఆ పుణ్యంకూడా మీకే దక్కుతుంది. " అన్నది మా లలనామణిగారు. " సరే చేస్తా " అన్నా. —

నాలుగు రోజులు అలాగే గడిచి పోయినయి. ఆ రోజు రాత్రి భోంచేసి, పక్కపలుకు నములుతూ తీరిగ్గా బాపిరాజు గారి " నారాయణరావు " మూడవసారి చదువుతూ కూర్చున్నా. వంటిల్లుమూసి, కొంగుతో చెయ్యి తుడుచుకుంటూ మా 'గృహలక్ష్మి' వచ్చి పక్కనే కూర్చుంది. " యేమండి ! నేను చెప్పినవిషయం యేమన్నా ఆలోచించారా? " యేం లాభంలేదు. యెవ్వరూ ఈ వివాహానికి యిష్టపడటంలేదు " అన్నా. నా ఈ జవాబు వినగానే ఆలోచనలో పడింది మా శ్రీమతి.

" నే నొక విషయం చెబుతాను వింటావు. " అన్నా పుస్తకంమూస్తూ.

"యేమిటి చెప్పండి?"

"కోపం రాదు కదా!"

"కోపం ఎందుకు చెప్పండి"

"ఆపిల్ల పెండ్లి కావాలంటే ......"

"ఆగిపోయారేం! చెప్పండి."

"పోనీలే. అనవసరంగా కోపం వస్తుంది."

"రాదు అన్నానుగా చెప్పండి"

"అయితే విను. మీ సంఘంవాళ్ళు ఆదర్శ నారీమణుల్లాగా నిలబడదల్చుకున్నారు! అవునా? అటువంటప్పుడు మీ సంఘ సభ్యుల్లో ఎవరికో ఒకరికి యిచ్చిచేయటం క్షేమం. అందరు మీ "శ్రీమతులు వప్పుకున్నా, వాళ్ళ "శ్రీ" వారు ఒప్పుకోవడంలేదు. — ఆపిల్ల పెళ్ళిఅయి మీ సంఘం ఆదర్శంగా నిలబడాలంటే ఒకటే మార్గం—"

"ఏమిటది?" ఆత్రంతో అడిగింది.

"ఆమార్గం— చెబితే నీకు ఎక్కడ కోపంవస్తుందో! భయంగా వుంది."

"కోపంరాదని తొంభైతొమ్మిదిసార్లు చెప్పాను. అనవసరంగా విసిగించక ఆమార్గం యేమిటో త్వరగా చెప్పండి" చెప్పమంటావా?!"

"అబ్బ! చెప్పండి. మీ పుణ్యం వుంటుంది.

"ఆ పిల్లను చేసుకోటానికి నేను సిద్ధంగా వున్నాను. మరి నీ వుద్దేశ్యం ..." నామాట పూర్తిగాకమునుపే, ఆమె కుతూహలం ఎల్లబడింది. విసురుగా లేచి యేమన్నారు! మీరు

చేసుకుంటారా!! ఆ పిల్లను!!! ఎవరన్నా వింటే నవ్విపోతారు. వుండండి మీ బుఱ్ఱకు ఈ పాడుబుద్ధి పుట్టిందేం? మీరు ఆ అమ్మాయిని చేసుకుంటే, సంఘంలో కార్యదర్శినైన నాకు ఏమైన మర్యాద వుంటుందా? నే నేంకావాలి? నుయ్యో గొయ్యో చూసుకుంటాను.'' అంటూ సముద్ర ప్రవాహంలాగ వస్తున్న కన్నీళ్ళని కొంగుతో తుడుచుకో సాగింది.

ఆ తర్వాత యేమయిందంటారా?

ఆ మరుచటిరోజే, నేను నవ్వుతూ, ఆమెలో సంస్కారం ఎంతవరకు యిమిడి జీర్ణమయిందో తెలుసుకుందామని, అన్న మాటల్ని "నిజం'' అని నమ్మతూ, మా శ్రీమతిగారు నంవత్సరంనుంచి నిర్విఘ్నంగా నిర్వహిస్తున్న "ఆదర్శమహిళా సంఘ'' కార్యదర్శి పదవికి రాజీనామాయిచ్చి, ఆ రోజునుంచి నన్ను వెయ్యికళ్లతో కనిపెడుతూ వుందంటే మీరు ఆశ్చర్య పడవలసిన పని లేదు. ఇంతకీ యేదైనా తనదాకవస్తే—ఇంతే !!!

# త్యాగజీవి

వేసవికాలంరోజులు రాత్రి పదికావస్తుంది. దూరంగా పట్టణంబయట కూలీబస్తీలో మంచాలు చోటులేకుండ చిందరవందరంగా పడివున్నాయి. పగలంతా కష్టించిన కష్టజీవులు తమ బరువు శరీరాల్ని విశ్రాంతి కోసము కుక్కి మంచాల్లోకి జేరుస్తున్నారు.

దారికి అడ్డంగావున్న మంచాలని దాటుచు 14 ఏండ్ల రంగడు వాడిపోయిన మొఖముతో తన పాతగుడిస దగ్గరకు జేరాడు. దగ్గరలోవున్న మంచంమీాద 8 ఏండ్లసీత, 11 ఏండ్ల చెన్నడు, ప్రశాంతంగా తియ్యటి నిద్రపోవటము చూసి, వాడిపోయిన రంగడిమొఖంలో చిరునవ్వు మెరుపులాగ మెరసి మాయమైంది. రంగడు ఆ మంచానికి ప్రక్కనేవున్న ఖాళీ మంచంలో నడుంవాల్చాడు. వెంటనే తమ్ముడిని, చెల్లెలిని చూసి మర్చిపోయిన 'ఆకలి' జ్ఞాపకమొచ్చింది. లేచి గుడిస లోపలికి వెళ్ళి చీకటిలో పొయ్యిదగ్గరవున్న కుండల్ని వెతికాడు. మొదటికుండ ఖాళీగావుండటంచూసి, 'గంజి' ఏమైన మిగిలిందేమోనని రెండోకుండ ఆత్రంతో, ఆశతో చూశాడు. అది కూడా ఖాళీగావుండటంచూసి, రంగని ఆశ కాస్త అడుగంటిపోయింది. ప్రక్కనేవున్న కుండలోని కాసిన్ని చల్లని నీళ్ళు త్రాగి, మనస్సుకు నచ్చచెప్పి కుక్కిమంచంలో ఒరిగాడు. ఆ సమయంలో రంగని లేతబుద్ధిలో ఎన్నో చిన్నచిన్న ఆలోచనలు రేగి తుఫానులేవటానికి ప్రయత్నిస్తూవున్నాయి. అలానే ఏవో ఆలోచిస్తు ఆకాశంవైపుచూశాడు. చుక్కలు కాంతిహీనంగా మినకు మినుకు మంటున్నాయి. వున్నట్టుండి ఒకచుక్క

రివ్వున క్రిందికి జారిపోయింది. ఆ మినుకు మినుకు మంటున్న చుక్కల్ని చూడగానే రంగనికి, రెండు సంవత్సరాలక్రిందటి సంగతి జ్ఞాపకం వచ్చింది. తల్లి చావుబ్రతుకుల్లో వున్న సమయమది. ఆ రోజుకూడ ఒక చుక్క యిప్పటి మాదిరిగానే క్రిందికి జారిపోయింది.

తల్లి జీర్ణించిపోయిన గొంతులో "వసంతాలు కూడా సరిగ్గా చవిచూడని రంగనికి చెబుతుంది." "నాయనా! తమ్ముణ్ణి, చెల్లెల్ని జాగ్రత్తగా చూసుకో. ఇక వాళ్ళకు వేళకు తిండిపెట్టి మంచిచెడ్డ చూసేతల్లి వుండదు. ఇక నుంచి అన్నిటికి నువ్వే! చూడు రంగా! ప్రపంచములో అన్నీ దొరుకుతాయి; కానీ "మాతృప్రేమ" మాత్రం దొరకదు."

ఆ మాటల్ని రెండేండ్లనుంచి మరచిపోకుండా రంగడు, చెల్లెలికి, తమ్మునికీ తల్లిలేనిలోపము, కలిగించక ముందు వాళ్ళకు తినిపించి, మిగిలింది తనుతింటూ కాలం గడుపు తున్నాడు.

కాలప్రవాహము ఎవ్వరికోసము ఆగదు. ఆ ప్రవాహములో కొట్టుకుపోయిన గులకరాళ్ళమాదిరి పడుతూ, లేస్తూ రంగడు, చెన్నడు, సీత పెద్దవాళ్ళయ్యారు. రంగడు యిప్పుడు కూలీచేయుటము మానేసి జీతానికి కుదిరాడు. రోజులు మునుపు లాగ వస్తులతో కాకుండ హాయిగానె గడుస్తున్నాయి. చెన్నడు కూడా ఇప్పుడు పనిచేయగలిగినంత వాడయ్యాడు. కానీ రంగని ప్రేమతో చెడిపోయాడు. అస్తమానం ఊరకనే

తిరిగి తేనివోని కయ్యాలు యింటిమీదికి తెచ్చేవాడు. మంద లించి మంచిదారికి తేవాలనుకునే రంగనికి తమ్ముడు ఎదుటకు రాగానే 'పేరిమ' తాళం పడేది.

*　　*　　*　　*　　*

ఆరోజు రంగడు, తమ్మునికి, చెల్లెలికి ఒక సంతోష వార్త చెప్పాలని పనిదగ్గరనుంచి బయలు దేరాడు. సీతకు పెండ్లి సంబంధం నిశ్చయమయినందులకు తనలోతనే సంతోషపడుతూ, ఇదేవార్త తెలియజేయాలని పడుతూ లేస్తూ యింటికి జేరాడు. కడపలో కాలుపెట్టగానే ఏడుస్తూ సీత ఎదురువచ్చింది. "ఏమి టమ్మ ఎందుకు ఏడుస్తున్నావు" గాభరగా ప్రశ్నించాడు. సీత ఏడుస్తునే మౌనంగా ప్రక్కగది చూపించింది. రంగడు ఆత్రంతో ప్రక్కగదిలోకి పరిగెత్తాడు. చిన్నడు నోరుతెరచి తెలివితప్పి పడివుండటం చూసి దగ్గర కెళ్ళాడు. దగ్గరకు వెళ్ళిన రంగనికి పరిస్థితి అంతా అర్థమయింది. తన అనుమానం నిజ రూపం దాల్చడంతో రంగనికి పిచ్చిలేసినంత పనయింది. తనలోతనే అనుకున్నంతపనయింది. "వీడు తాగుడు కూడా మొదలెట్టాడు" అనుకున్నాడు కోపంతో "వెధవకు అన్నం, నీళ్ళుయివ్వకు" చెల్లితో అన్నాడు. కాని తనే ఆమాటమీద అమలు జరుపలేక పోయాడు. ఆ రాత్రంతా తమ్ముని దగ్గర కూర్చొని, అతణ్ణి తెలివిలోకి తీసుకురావటానికి ప్రయత్నిస్తూ రంగడు కన్నుమూసిన పాపాన పోలేదు.

ఈసంగతి జరిగిన తరువాత అన్న తనని ఏమీ మంద లించకపోయే సరికి చిన్నడి ఆగడం మితిమీరి పోయింది.

మాతృప్రేమనుకూడ మరిపించె రంగడిప్రేమ అతనికి త్రాగుడు తోబాటు 'జూదం'కూడ నేర్పింది. రంగడు ముందు చెల్లెలి పెండ్లి చేశేయాలనుకున్నాడు. ఎట్లానో తిప్పలుపడి ముత్తానికి ఆ మూడుముళ్ళూ వడేయించాడు. చెల్లెలు అత్తగారింటికి వెళ్ళటంతో, రంగని నెత్తిమీది సగంబరువుకాస్త దిగిపోయింది. అటు సీత అత్తగారింటి ప్రయాణముతో ఇటు యింటి పనులన్నీ రంగని నెత్తిమీద పడ్డాయి. ప్రొద్దున్నే లేచి వండి తమ్మునికి పెట్టి తను యింత తిని నౌకరీకి పరుగెత్తేవాడు. ఇలా తిప్పలు పడుతున్న రంగనిజూచి చుట్టుప్రక్కల పెద్దలు "ఒరేయ్ రంగా! యిలా చేతులుకాల్చుకొని ఎన్నాళ్ళు తిప్పలు పడతావు? పెండ్లి చేసుకోరాదూ?" అంటూ వుండేవాళ్ళు. స్వయంపాకంవల్ల వుప్పూకారంలేని మెతుకులు తిని విసిగెత్తి పోతూవున్న రంగనికి ఈ మాట నిజమే అనిపించింది.

పెద్ద దిక్కు లేకపోనటం వల్ల, రంగడే తనకోసం సంబంధం వెతికి ఒక బీదయింటి పిల్లను నిశ్చయంచేసుకున్నాడు.

ఒకరోజు రంగడు పనినుంచి యింటికి వచ్చేసరికి, చెన్నడు అతని 'ఆవార' స్నేహితులు యింట్లో తిష్టవేసియున్నారు. అన్న విరుద్ధంగా చెప్పినమాటలన్నీ చెన్నని బుర్రలో ఆలోచనకుతావు లేకుండ ఆక్రమించుకున్నాయి. "అవును అన్న కునాసంగ తేపట్టి లేదు. తన పెండ్లి సంతోషంలో అందర్నీ మర్చిపోయాడు. మా అమ్మేవుంటే........ఆపైన వినలేకపోయాడు

'తమ్మునికి ఏంలోపం కలుగజేశానా' అని తనమనస్సును, తన ప్రేమను, వాత్సల్యాన్ని శోధించటం మొదలుపెట్టాడు. కానీ తల్లిని తలంచుకొని "అమ్మా! నీవే చెప్పు ఎప్పుడు నేను చెన్నని సంగతి పట్టించుకోలేదు ? ఎప్పుడు నేను చెన్ననికి తినిపించకుండ ముందు నేను తిన్నాను ? నీచెన్ననివల్ల నేను ఎంతమందికి పగ వాణ్ణి కాలేదు ? అమ్మా......

వారం రోజులలో అవవలసిన పెండ్లి హఠాత్తుగా ఆగి పోవటానికి అసలుకారణము ఏమిటో ఎవ్వరికి తెలియదు. రంగడు ముందు చెన్నని కో సంబంధం వెతకటం మొదలు పెట్టాడు కాని...ఇప్పుడిప్పుడే బాల్యాంధకారంలోనుంచి యౌవ నపు వెలుగులోనికి తొంగిచూస్తూ, స్నేహితుల సలహాలతో మంచి చెడ్డా, వెనకా ముందూ ఆలోచించ లేని స్థితిలో వున్న చెన్నడు రంగడు నిశ్చయించేసుకున్న పిల్లనుతప్ప వేరే ఎవ్వరిని చేసుకోనని పట్టుపట్టాడు – ఈ విషయం తెలి సిన రంగనికి తలకొట్టి వేసినంత పనయింది. ఎన్నోవిధాల తమ్ముడికి చెప్పిచూశాడు. ఆఖరికి తమ్ముడి కాళ్ళు పట్టుకొని "తమ్ముడూ! నీ వుద్దేశ్యం మార్చుకో." అని ప్రాధేయ పడ్డాడు. కానీ ......ఇక ప్రేమతో లాలించి చెబితే లాభం లేదని, జీవితంలో తొలిసారిగా కోపంతో నాల్గు చీవాట్లతో మందలించి రంగడు ఏదో పనిమీద వెళ్ళిపోయాడు.

రాత్రి 8 అయివుంటుంది. రంగడు పనిచూసుకొని తిరిగి వచ్చేసరికి చెన్నడు యింట్లో లేడు. 'స్నేహితుల్తో ఎక్కడికో సా

వెళ్ళాడేమో!' అనుకున్నాడు. ఇంతలో ఎవరో వచ్చి "తప్ప త్రాగి ఎవర్నో చంపుతానంటూ వెళ్ళాడ"ని చెప్పటంతో రంగని నెత్తిమీద పిడుగుపడినంత పనయింది. రంగడు తను నిశ్చయం చేసుకున్న పిల్లయింటికి పరిగెత్తాడు గడపలో కాలు పెడుతువుండగానే, లోపలనుంచి చెన్నడు రావటం, అన్నదమ్ములు ఒకరిమొఖాలు ఒక్కరు చూసుకోవటం ఒకేసారి జరిగింది. రంగని మొఖం చూడగానే, చెన్నడి చేతుల్లోని చాకు జారి క్రిందపడింది. రక్తంలోతడిసి క్రింద పడ్డచాకును చూడగానే, రంగని కళ్ళముందు చీకటి ఆవేశించింది. వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ తల్లిని తలచుకొని "చూశావా అమ్మా! చెన్నడు ఎంతపని చేశాడో! ఇతన్ని ఇకనీవే కాపాడుకో!" అంటు కుమిలాడు.

ఇటు అన్న నిశ్చయంచేసుకున్న పిల్లను హత్యచేయగానే చెన్నని 'కైపు' అంతా దెబ్బతో ఎగిరిపోయింది. తల్లిని తలచుకొని అన్నగారు అంటున్నమాటలు వినగానే, అన్నగారి వాత్సల్యం అప్పుడు అర్థమయింది. బూజుపట్టి, ఎటూ కదలకుండావున్న అతని మెదడుకు జ్ఞానోదయం కలిగింది. తను చేసిన మూర్ఖపుపనికి తనలో తనే భయపడి పోయాడు. పశ్చాత్తాపపడ్డాడు. కానీ యేం లాభం, చెట్టునుంచి రాలిన ఆకు తిరిగి అతుక్కోదూ. అన్నగారికి తన పాపిష్టి మొఖం చూపించడానికి యిష్టంలేక అక్కడనించి పారిపోయాడు. రంగడు ఆ రక్తంతో మునిగి తేలుతువున్న చాకును తన చొక్కాతో తుడిచి వేశాడు.

కోర్టులో రంగడు తనే ఆ పిల్లను హత్య చేశానన్నాడు. కానీ చెన్నడు "కాదు! ఆ అమ్మాయిని చంపింది నేను!" అని పిచ్చివాడిలాగ అరిచాడు. ఇద్దరూ హంతకులమని ఒప్పుకోవటంతో, కోర్టు సందిగ్ధావస్థలోపడి, కేసును కొద్దిరోజుల దాక వాయిదా వేసింది.

ఆఖరి కేసురోజున అన్నదమ్ములిద్దరూ కొంచెంసేపు మాట్లాడుకునే అవకాశం దొరికింది. "తమ్ముడూ! ఎందుకిలా నన్ను చావనీయకుండా, బ్రతకనీయకుండా చేస్తున్నావు" అన్నాడు రంగడు. అందుకు చెన్నడు అన్నగారి కాళ్ళమీద పడి "క్షమించు అన్నా" అని చిన్న పిల్లవాడిలాగ ఏడవటం మొదలు పెట్టాడు. తమ్ముడిలోని ఈ పరివర్తనచూసి సంతోషంతో లేవదీసి కౌగలించుకున్నాడు. వీపు నిమురుతూ "చెన్నా! ఇప్పుడైనా నీ అన్నది ఒకమాట వింటావా?" "చెప్పు అన్నా" ఆత్రంతో చెన్నడన్నాడు. రంగడు శాంతంతో "ఈ కేసునుంచీ నీవు తప్పుకో. నన్ను ......" ఏమో అనబోతు వుండగానే చెన్నడు మధ్యలో "అన్నా!" అంటూ గట్టిగా కౌగలించుకొని, వెక్కి వెక్కి ఏడ్వసాగాడు. "చెన్నా! ఆఖరిసారి నీ అన్నది ఈ ఒక్క కోర్కె తీర్చు. ఇదే నేను నీనుంచి కోరే మొదటికోరిక. చివరికోరిక కూడాను. ఈ ఒక్క కోర్కె చెల్లించి నా ఆత్మకు శాంతికలిగించు" అన్నాడు రంగడు.

చెన్నడు రంగని ఆఖరికోరిక చెల్లించటానికి యిష్టపడక పోయినా, పరిస్థితుల ప్రభావంచేత అన్నగారి కోర్కెను తీర్చి

అతని ఋణం తీర్చుకున్నాడు. తమ్ముడిలోని పరివర్తనం చూచి తల్లిని తలచుకుంటూ ఆ "త్యాగజీవి" సంతోషంతో, ఉరికంబాన్ని ఆహ్వానించాడు.

# చిరునవ్వు మహాత్యం

ఎండాకాలంరోజులు, ప్రొద్దునదాకా కాలేజీక్లాసులోని నాల్గుగోడలమధ్య తల పగలగొట్టుకొని, నాలుగు గంటల తరువాత బైటపడి కాఫీ దేవతోపాసనచేసి మామిత్రబృందం అంత బీచి వైపుకు నడకసాగించింది. ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ ఒక ఫర్లాంగుదూరం నడిచామో లేదో, మామిత్రద్వయం సడన్ బ్రేక్ వేసిన మోటరులాగ ఒకవైపు కళ్ళుప్పగించిచూస్తూనిలబడి పోయింది. వీళ్ళందరు యింతగాచూసేటి దేనినా అని నేనూ అలా చూసేటప్పటికి మూర్ఛ వచ్చినంత పనయింది. ఎవరో 16 ఏండ్ల అమ్మాయి (కాస్త అందంగావుంది లేండీ!) నిమ్మళంగా అటు వెళ్తూవుంది. స్త్రీలంటే అందులో యువతులంటే పడిచచ్చే రూంమేట్ మా 'రావు' "ఆహాహా! యేమి ఆయువతీలావణ్యము. పున్నమచంద్రునిబోలు ఆ మొఖబింబము, దొండపండు లాంటి ఆ పెదవులు నవ్వితే సొట్టలుపడే ఆపిల్ పండ్లలాంటి ఆ లేగులాబి చెక్కిళ్లు, చూచినవారిని మంత్రముగ్ధులు కావించే తుమ్మెద రెక్కలలాంటి ఆ కండ్లు, నిజంగా దేవలోకంలోని రంభను మరిపిస్తువుంది" అని తన పైత్యకవిత్వం మొదలుపెట్టేసరికి "ఒరేయ్! అంతటితో ఆపరా నీ కపిత్వం. ఎవరన్నవింటే వీవులు మనవికావు జాగ్రత్త!" అంటు హెచ్చరించాను. అందుకు వాడు వికటంగా నవ్వుతూ "వడిచావు లేవోయి! నీవంటి పిరికిదద్దమ్మ లుండబట్టె, మనఖర్మ యిలా కాలింది." అని అన్నాడు — అనటముతోనే ఆగక మా

అందరికి ఒక నమస్కార బాణం ప్రయోగించి "ఇప్పుడేవస్తా" నంటూ ఆ యువతి వెనకాలే సినిమాలో హీరోలాగా నడక సాగించాడు.

"చెడేవాడిని బాగుచేసేవాడు లేడు. బాగుపడేవానిని చెడిపేవాడు లేడన్నట్లు" 'ఎవరుఖర్మ వారిది' అని మనసులో అనుకొని గప్‌చిప్‌గా వూరకున్నాను. మా మిత్రసమితికూడ వాడు అలా ఆ యువతి వెనకాలే వెళ్ళటంచూచి, ఏమి చేయటానికి, అనటానికి తోచక నిప్పల్లాగ నోర్లు తెరచి గుడ్ల ప్పగించి చూస్తూ వూరకున్నారు. బరువుశరీరాలతో పోయిన మేము. బీచ్‌గాలితో తేలికపడ్డ మా శరీరాన్ని రాత్రి ఎనిమిది గంటలకు హాస్టల్ చేర్చాము.

భోంచేసి పరీక్షలు దగ్గరకు రావడం వల్ల పుస్తకాలు ముందేసుకు కూర్చున్నాను. బహుశః 9-30 గం॥ అయిందను కుంటాను. మా 'రావు' నిమ్మళంగా "కల నిజమాయెగా, కోరిక తీరెగా" అన్న పాట పాడుకుంటూ దిగాడు. హుషారుగా కనపడ్డాడు. బహుశః సంతోషముతో నేమో, అతని మొఖము కందగడ్డలాగ ఎఱ్ఱబడి, గుమ్మడికాయంత లావయినట్లు కనిపించింది. "ఏమిటోయ్ గిరాకీ! వెళ్ళిన పని అయిందా" అని నేను వుండలేక అడిగాను. 'అవకేం చేస్తుందిరా. ఈ 'రావు' పట్టుబట్టాడంటే అంతుతేలిందాకా వదలడు. తెలుసా! 'గర్వంతో జవాబిచ్చాడు. కొంచెం ఆగి 'ఏంజరిగిందేమిటి? 'అన్నాను.' ఏముంది! ఒక్క చూపుతో మనసులోని భావాలన్నీ బయట పడ్డాయి, రేపు ఈవినింగ్ 'టీ'కి కూడా

ఆహ్వానం వచ్చింది.' అని చొక్కా విప్పి మంచంమీద జేరాడు. నేను మళ్ళీ సందేహంతో 'ఆ అమ్మాయి పిలిచిందా? ఎక్కడికి???' అడిగాను 'ఆ అమ్మాయి కాకపోతే, యింకెవరా! ఆ అమ్మాయె! వాళ్ళింటికే ఆహ్వానించింది. తెలిసిందా!' అంటూ సంతోషంలో అన్నం తినడం కూడా మర్చిపోయి, ముసుగు తన్ని పడుకున్నాడు.

మరునాడు ఆదివారం అవటంవల్ల, మావాడు రెండు గంటలనుంచి ఆహ్వానంకోసం 'టాయిలెట్' మొదలుపెట్టాడు. ఫస్టుక్లాసు, నల్లసూటు, ఫ్రేంలేని కళ్ళద్దాలు తగిలించి 4 గం॥ కల్లా టాయిలెట్ అయ్యాడు. చిరునవ్వుతో వెళ్తూ వెళ్తూ 'వెళ్ళొస్తానోయ్! గుడ్ బై' టకటక బూట్ల చప్పుడు చేసుకుంటూ వెళ్ళిపోయాడు.

సాయంత్రం నాలుగు గంటల కెళ్ళినవాడు రాత్రి ఎనిమిది గంటలకు తిరిగి వచ్చాడు. వాడి మొఖం చూడగానే ఆశ్చర్యం కలిగింది. పోయేముందు వేడివేడి పెసరట్టులాగ పేలిపోతువున్న మొఖం, ఇప్పుడు చప్పగా చల్లబడ్డ మినపట్టులాగ తెల్లబడివుంది. వచ్చీరావటంతోనే కోటువిప్పి విసిరి మంచంమీద పారేశాడు. టై లూజ్ చేసుకొని 'అచ్చా!' అంటూ పడకకుర్చీలో జేరగిలబడ్డాడు. 'ఏమయిందిరా! అట్లున్నావు!' అన్నా 'ఏంలేదు' అంటూ మూల్గుతూ ముక్తసరిగా జవాబిచ్చాడు. సరిగ్గా గాలి రాకపోవడం వల్ల చొక్కా విప్పాడు. చొక్కా విప్పగానే, వాని తెల్లటి వీపుమీద నల్లగా కమిలిపోయిన [illegible] పాముల్లాంటి గుర్తులు కన్పించగానే అదిరి

పడ్డాను. భయంతో, ఆశ్చర్యంతో "ఏమిటో యిదంతా" అన్నాను. 'ప్రేమ బహుమానమురా యిది!' అని నా ప్రశ్నకు జవాబిచ్చాడు. ఇదేరకం బహుమానమో అర్థంకాక తికమక పడి 'అంటే?' మళ్ళీ ప్రశ్నించాను 'ముందు సిగిరెట్ యివ్వరా, తరువాత చెబుతాను' నేను సిగిరెట్ అందివ్వగానే వెలిగించి 'ఇదంతా నిన్నటి ఆ అమ్మాయిగారి ప్రేమ ప్రసాదం, నిన్న నేను మీ అంగడ్ని విడిచి ఆ అమ్మాయి వెనకాలే బయలుదేరాను. కొంచం దూరం పోగానే వెనుక్కు తిరిగి చూసి నడక స్పీడ్ ఎక్కువ చేసింది. నేను అలా చేశాను. కొంచెం తగ్గించింది. నేనూ అదేవిధం అనుసరించాను. ఇంకా అలా కొంచెం దూరం పోగానే ఠక్కున ఆగి 'మీకు ఏంకావాలి? ఎందుకలా నా వెనకాల వస్తున్నారు.' అని ముసినవ్వులతో అడిగింది. ముసి ముసి నవ్వులతో మాట్లాడగానే నాకు కొంచం ధైర్యం కల్గింది. 'ఏమీ లేదు! మీతో...కొంచెం...మాట్లాడా...లి.' నీళ్ళు నములుతూ అన్నా. కొంచెం ఆలోచించి 'సరే రేపు సాయంత్రం 'టీ' కి మా యింటికిరండి. అక్కడ కులాసాగా మాట్లాడుకుందాం' అని చేతిలోని బ్యాంగ్ ఫూగించుకుంటూ, తిరిగి తిరిగి చూస్తూ వెళ్ళిపోయింది. నా ఈ అకస్మాత్తు అదృష్టానికి నాలో నేనే సంతోషపడుతూ, ఆమె రమ్మనిన ప్రకారం యింటికెళ్ళాను.' చేతిలో సగానికి పైగా కాలి ఆరిపోయిన సిగిరెటు పారవేసి క్రొత్త సిగిరెటు వెలిగిస్తూ మళ్ళీ మొదలు పెట్టాడు.

'యింటిగడపలో కాలు పెడుతూ వుండగానే ఆమె లోపల నుంచి వస్తూ "రండి! మీకోసమే ఎదురు చూస్తున్నా!"

అంటూ ఆహ్వానించి ఒక రూంలోకి తీసుకెళ్ళి కుర్చీ చూపించింది. ఇంట్లో ఎటువంటి చప్పుడూ లేదు. 'అమ్మా నాన్న అందరూ సినిమా కెళ్ళారు.' ఈ మాటవినగానే ధైర్యం చిక్కబడింది. ఆమె నా వైపు ఎగా దిగా చూసి మీకునల్లసూటు బావుంటుందండీ'' నవ్వుతూ అనగానే నాలో నేనే నా అదృష్టానికిపొంగిపోయాను. కొంచెం ఆగి 'మీపేరుచెప్పారుగా దూ! 'అన్నది. 'నన్ను మావాళ్ళందరూ 'రావు' అని పిలుస్తారులేండి. అసలు పూర్తి పేరు 'వెంకట సుబ్బారావు' ప్రస్తుతం ఇంటర్ సెకండియర్ లో వున్నాను.' నవ్వుతూ జవాబిచ్చాను. 'మీపేరు' అని అడగ్గానే నన్ను 'రాజ్యం' అని పిలుస్తారు. పూర్తి పేరు 'స్వరాజ్యం' లేండి.'అని కొంచెం ఆగి'మీరు'నాకు ఈ బహువచన ప్రయోగం బాగనిపించలేదు. 'నన్ను మీరు' అని ఎందుకు పిలుస్తారు. 'మిస్టర్ రావు' అనండిఅన్నా.'అయితే మిస్టర్ రావు గారు నిన్న మీరేదోనాతో మాట్లాడన్నారు!' 'అవును అదేవిషయం ... అదే ... యేమిటంటే' ......

అప్పుడు నాకు గొంతులోనుంచి మాటరాలేదు. ఎవరో నోటికి తాళం వేసి నట్లనిపించింది. గుండె దడ దడ కొట్టుకోవటం మొదలుపెట్టింది. 'నేను ......మిమ్మల్ని......ప్రే...... మిస్తు......న్నా......ను.......'అని ఎట్లానో తిప్పలుపడి దారి వెంబడి వల్లెవేసుకుంటూ వచ్చిన. మనసులో వున్న ఆమూడు ముక్కలు ఆమెముందు కక్కేశాను. ఈమాటల్తో నాచొక్కా అంతా చెమటతో తడిసిపోయింది.గుండె యింకా జోరుగా కొట్టుకోసాగింది. 'ఏమంటుందో' అని ముఖం

వైపు ఆత్రంగా చూశాను. ఆమె ముఖంలో ఏ విధమైన మార్పు కన్పించలేదు. ముందులాగే చిరునవ్వుతో తలక్రిందికి వంచుకోంగానే. నా అదృష్టం పండిందనుకున్నాను. నేను వచ్చిన పని ఉండనుకున్నాను. కొంచెం సేపటివరకు ఎవరం మాట్లాడలేదు. లేచి వెళ్తూ "వుండండి 'టీ' తెస్తాను." అంటూ లోపలికి వెళ్ళింది నేను ఆమెపోయిన తలుపు వైపే 'ఎప్పుడు వస్తుందా' అని ఎదురు చూస్తు కూర్చున్నాను. 'మౌనం అర్ధాంగీకారసూచకం' అన్నారు! కదా పెద్దలు. మరి ఆమె 'నేను ప్రేమిస్తున్నాను' అన్నప్పుడు నవ్వుతో వూరుకోవటంతో ఆమెకు నామీద మనసు వుందని అనుకొని, ఏవేవో తియ్యని కలలు కంటూ, స్వర్గవీథుల్లో విహరిస్తు కూర్చున్నాను.

"అయితే వీడేనా ఆ వెధవ" అన్న సింహగర్జన లాంటి శబ్దం విని అదిరి నాకలల ప్రపంచంలోంచి బయటపడి చూసే సరికి, ఏనుగంత మనిషి చేతిలో సన్నని బెత్తం పట్టుకొని, నన్ను మింగాలన్నంత కోపంతో చూస్తు నిలబడి వున్నాడు. ఆయనగారిని చూడగానే నా పై ప్రాణాలుపైనే ఎగిరిపోయినవి. అప్పుడునాకా అమ్మాయిగారి 'చిరునవ్వు' లోని మర్మం అంతా అర్ధమయింది. నేను వెంటనే, విప్పి కుర్చీకి తగిలించిన కోటు చంకలోదూర్చి, వీపు పూజ కాకముందే బయట పడదామనుకున్నాను. వెంటనే వెనుకనుంచి ఆ బెత్తంతో వీపుమీద మూడు వడ్డించాడు. ఆ మహానుభావుడు!" అని దీర్ఘ నిట్టూర్పు విడిచి 'ఇదిరా బాబు నా కథ' అంటూ బాధతో మూల్గాడు. "అప్పుడే చెబితే విన్నావు! 'మొగుడు చస్తేకాని

తుంటకు బుద్ధిరాదు' ఆ శాస్త్ర ప్రమాణం ఒంటిమీద పడితే గాని అయ్యగారి పిక్క కుదురలేదు. ఇంకా నయం వీపుపూజ తోనే విడిచి పెట్టాను.'' అన్నాను నేను. అందుకు వాడు ''యింతపని ఆ 'చిరునవ్వు' చేసిందిరా బాబు!'' ''నాకు అంటే రోగమేమిటిరా! ఏ యువతినైనా అలా నవ్వుతూ మాట్లాడితే చాలు! తననిచూసి అలా నవ్వితేసరి! ఇక ఆమె మనల్ని ప్రేమిస్తుందని మురిసిపోతాం. సరేలే అయిందేదో అయింది. ఇక నుంచయిన పిచ్చి పిచ్చి చేష్టలు చేయక ఒళ్ళు దగ్గరుంచుకొని బుద్ధితో తిరుగు'' అన్నాను వస్తున్న నవ్వు ఆపుకుంటూ. అందుకు మారాధ 'బుద్ధివచ్చిందిరా బాబు...ఒరేయి అయిందేదో అయింది. ఈ సంగతిమాత్రం మన వాళ్ళెవరికి తెలియనియ్యకురా! నీ కాళ్ళు పట్టుకుంటాను'...అని బ్రతిమాలటం మొదలు పెట్టాడు.

మావాడికి పిక్క ఒక్క దెబ్బతో వదిలి పోవటంతో నాకు ఎంతో సంతోషము కల్గింది. ఆ రాత్రంతా వేడినీళ్ళ గుడ్డతో వానివీపు కాపుతూ జరిగిన కథ తలచుకొని కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వుతూ నిద్రపోలేదంటే నమ్మండి.

